# 2023 గాజా యుద్ధము -- చారిత్రిక నేపధ్యము



రచన - సేకరణ వారణాసి శ్రీ రామ కృష్ణ

## 2023 గాజా యుద్ధము -- చారిత్రిక నేపధ్యము

అక్టోబర్ -07 -2023 పాలస్తీనా లో వున్న హమాస్ అనే మిలిటెంట్ గ్రూపు కి సంభందించిన కొన్ని వందల మంది మిలిటెంట్లు తుపాకులు చేతబూని - గాజా అనే ప్రాంతము నుండి - ఇస్రాయిల్ భూభాగం సరిహద్దులమీదకు విరుచుకు పడి దరిదాపు 1,200

మందిని చంపి , 200 మంది ఇస్రాయిల్ వారిని బందీలుగా పట్టుకున్నారు .

<>అసలు గాజా అనునది ఏమిటి? <>
వరల్డ్ వార్ ఒకటి (1914–18), నాటికి గాజా ప్రాంతము - పాలస్తీనా అనే దేశములో ని ఒక భూ భాగంగా -- బ్రిటిష్ వారి ఏలుబడిలో వున్నది .

<>పాలస్తీనా అనేది ఏమిటి ? <> - బ్రిటిష్ వలస రాజ్యాలలో ఈ పాలస్తీనా అనేది ఒక ప్రాంతము. మొదటి ప్రపంచ యుద్ధములో బ్రిటన్ మరియు ఫ్రాన్స్ మధ్య జరిగిన ఒక ఒప్పందం మూలకంగా ఈ పాలస్తీనా భూభాగము -{ దేశము కాదు} బ్రిటిష్ వారి ఆధీనంలోకి వచ్చి 1920 నుండీ 1948 వరకూ వారి పాలనలోనే వుంది .ఈ పాలస్తీనా ప్రాంతము లో 86% అరబ్ లు . 13% జ్యూయిష్ లు ఇంకా 1% ఇతరులు ఉండేవారు . మొత్తము పాలస్తీనాలో వున్న 86% అరబ్ ప్రజలలోని 21 % మంది -- ఆ లాగే మొత్తము పాలస్తీనాలో వున్న 13% యూదులలో 74 % మందియూదులు మరియు ఇతరులూ కలసి ఒక ప్రాంతములో ఉండేవారు . అనగా పాలస్తీనా మొత్తము ప్రాంతములోఅరబ్బులు ఎక్కువగానే వున్నా , ఒకచోట మాత్రం అరబ్ లుతక్కువగానూ యూదులు ఎక్కువగా నూ ఉండేవారు అన్నమాట . యూదులు అందరూ ఒక్క చోటనే ఎందుకు జమ పడ్డారు అంటే ? నాజీల మారణ కాండను తప్పించుకోవటానికి అని వచ్చిన యూదులందరూ పాలస్తీనాలో ని ఈ ప్రాంతానికి వచ్చి ఆశ్రయం పొందారు

.ఈ యూదులు అందరూ జమ పడ్డ చోటు -- ఆ రోజుల్లో **UPTO 191**అంటే **1917** వరకూ " ఒత్తమిన్" అను చక్రవర్తి రాజ్యము లోని ఒక భూ భాగము ." ఒత్తమ్మిన్" చక్రవర్తకి చెందిన ఈ **{**ఎక్కువగా యూదులు జమ పడ్డ **}** భూ భాగము వరల్డ్ వార్ ఒకటి **(1914–18),** నాటికి పాలస్తీనా అన్న పేరుతో - బ్రిటిష్ వారి ఏలుబడిలో కి వచ్చింది

## 1920-1946
## Jewish immigration to Palestine

An estimated **376,415 Jewish immigrants, mostly from Europe,** arrived in Palestine between 1920 and 1946 according to British records.




| Year | Authorized Jewish Immigration |
|---|---|
| 1920 | 5,514 |
| 1921 | 9,149 |
| 1922 | 7,844 |
| 1923 | 7,421 |
| 1924 | 12,856 |
| 1925 | 33,801 |
| 1926 | 13,081 |
| 1927 | 2,713 |
| 1928 | 2,178 |
| 1929 | 5,249 |
| 1930 | 4,944 |
| 1931 | 4,075 |
| 1932 | 9,553 |
| 1933 | 30,327 |
| 1934 | 42,359 |
| 1935 | 61,854 |
| 1936 | 29,727 |
| 1937 | 10,536 |
| 1938 | 12,868 |
| 1939 | 16,405 |
| 1940 | 4,547 |
| 1941 | 3,647 |
| 1942 | 2,194 |
| 1943 | 8,507 |
| 1944 | 14,464 |
| 1945 | 12,751 |
| 1946 | 7,851 |




మొత్తము పాలస్తీనా ప్రాంతము మీద బ్రిటిష్ వారి యేలుబడి - **1947** నవంబర్ లో పూర్తి కావలెనని ఒక ఒప్పందం వుంది . ఆ సమయానికి ముందే ---- .జ్యూయిష్ లు మెజారిటీ గా ను , అరబ్ లు మైనారిటీలుగా ను -వున్న ప్రాంతములోని యూదులు తమకోసం అని ఒక దేశాన్ని ఏర్పాటు చేసుకుంటే దానికి తాను మద్దత్తు ఇస్తానని - బ్రిటన్ ప్రకటించింది. అనగా నాజీల వేధింపులకు గురి ఐన యూదులకు ఒక ఉపసమనం లాంటిది కలిగించాలని బ్రిటన్

అనుకున్నది . ఇలాచేస్తే అక్కడి మైనారిటీలుగా వున్నవారు అరబ్ వారు యూదుల పాలన కిందకు వస్తారు. ఎక్కడినుండో పారిపోయి వచ్చి తమ రాజ్యములో ప్రవేశించిన యూదుల అధికారాన్ని అరబ్బులు అంగీకరిస్తారా ? లేదా ? అన్న ప్రశ్నకు జవాబు లేదు

ఇందులో యునైటెడ్ నేషన్స్ సంస్థ జోక్యం చేసుకొని - పాలస్తీనాలో బ్రిటిష్ వారి పాలన ముగిసే లోపునే - " యూదులు మెజారిటీగా వున్న ప్రాంతములో యూదులకోసము అని ఒక ప్రదేశాన్ని కేటాయించటమే కాకుండా - ఆ ప్రాంతములో మైనారిటీలుగా వున్న అరబ్ తెగ ప్రజలకు కూడా కొంత ప్రత్యేక స్థలాన్ని కేటాయించాలని - తీర్మానం చేసింది .

దీని ప్రకారము పాలస్తీనా అనేది మూడు ముక్కలు అయ్యింది

**Israel-Palestine escalation**

## Mapping Israeli occupation

According to Human Rights Watch, Israel - which calls itself a Jewish state - is committing "**crimes against humanity of apartheid and persecution**" against Palestinians.







Source: Palestinian Central Bureau of Statistics (2019), Israeli Central Bureau of Statistics (2020). Israel Ministry of Interior (2020). Jerusalem Institute for Policy Research (2020). @AJLabs

మొదటి ముక్క  -  **Jewish** స్టేట్**=** , యూదుల  లకోసము  అని - రొండొది -  **Arab State =**అరబీల కోసము , మూడవది **= City of Jerusalem.** ఈ మూడో ముక్క అనేది  ఇద్దరికీ కలిపి ఉంటుంది . జెరూసెలెం ప్రాంతము వుమ్మడి ప్రాంతము కాబట్టి దాని పాలన యునైటెడ్ నేషన్స్ యొక్క అధీనంలో ఉంటుంది . ఇలా వున్న తన అధీనం లో వున్నా  ఈ జెరూసలేం ప్రాంతాన్ని - యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజెషన్  **November 2012** న పాలస్తీనా దేశంగా గుర్తించి -

దానికి యునైటెడ్ నేషన్స్ లో  **139** వ దేశంగా సభ్యత్వం ఇచ్చి గుర్తించింది . ఆరకంగా మొత్తము పాలస్తీనా విడిపోయినాక - చిన్న పాలస్తీనా దేశము తిరిగి పుట్టింది . చచ్చింది అనుకున్న పాలస్తీనా దేశము తిరిగి బ్రతికింది .పాలస్తీనాలో రాజకీయ పరమైన పరి పాలన కూడా మొదలైంది  .

**May 14, 1948, David Ben-Gurion,** అనే జ్యూయిష్ నాయకుడు అమెరికన్ ప్రెసిడెంట్ ట్రూమెన్ ని  కలిసి "  బ్రిటన్ యూదుల కోసమని  కేటాయించి  ఇచ్చిన  ప్రాంతములో నేను "ఇజ్రాయిల్"  అనే పేరిట యూదులకోసము ఒక దేశం   ఏర్పాటు చేశానని
ప్రకటించాడు .





గాజా ప్రాంతము అరబ్బులకు కేటాయింపబడింది .అనగా గాజా మినహాగా ఇస్రాయిల్ పుట్టింది. కానీ గాజాలో ప్రభుత్వము ఏర్పాటు చేస్తున్నాము అని ఎవరూ ముందుకు రాకపోవటంతో అది ఒక దేశము కాలేక పోయింది . కానీ ఈ వేర్పాటుకు ముందు ఇటు జ్యూయిష్ వారు అటు అరబ్ వారు కూడా  పాలస్తీనా అనే దేశములో కలిసి మెలిసి వున్న ప్రజలేకదా ?  అందువల్ల ఇస్రాయిల్ ప్రజల

మధ్య  అరబ్ వారు **-**అరబ్ ప్రజల మధ్య ఇస్రాయిల్ ప్రజలూ ఉంటూనే ఉండేవారు **.**

మే **14  1948** న ఇస్రాయిల్ దేశము పుట్టగా **-** అప్పటి   అమెరికన్ ప్రెసిడెంట్ **. Harry S. Truman** అదేరోజున ఆ దేశానికి గుర్తింపు ఇచ్చేసాడు **. uno   .**ఇస్రాయిల్ దేశాన్నీ   **November 2023,** తమలోని **165**  వ సభ్య దేశం క్రింద గుర్తించింది **.** మే **15 1948**  న మొత్తము  పాలస్తీనాపై  తనకు వున్న పరిపాలనా హక్కులను బ్రిటిష్ దేశము వదిలివేసింది **,** వారి పాలన ముగిసింది అన్న మరు క్షణమే అంటే  **-** అదే మే **15 1948**  న**--**  ఈజిప్టు దేశానికి చెందిన సైనిక బలగాలు గాజా పై దాడి చేసి  **-** ఆప్రాంతంలో కొంత  ఆక్రమణ చేసి **-** దాన్ని**-**  తన సైనిక స్థావరంగా ప్రకటించుకుంది **.**




**<>** గాజా పై ఈజిప్టు ఎందుకు దాడి చేసింది **?<>**    గాజా కి సౌత్ వెస్ట్ బోర్డరుగా ఈజిప్టు వున్నది **.**   **"**మొత్తము ప్రపంచములో  వున్న

ముస్లిం ప్రాంతాలను అన్నింటిని ఒకటిగా ఏకము చేసి ఒక ముస్లిం మహా సామ్రాజ్యాన్ని స్థాపించటం " అనే ఆలోచనతో ప్రేరేపితము అయిన ఈజిప్టు దేశము గాజా పైకి దండెత్తి వచ్చింది .ఎందుకంటే గాజాలో ఎక్కువమంది అరబ్బులు వున్నారు కాబట్టి . దీనిని మొదటి అరబ్ - ఇస్రాయిలి యుద్ధముగా పిలుస్తారు . అనగా అరబీలకు - యూదులకు మధ్య యుద్దాలు అని కూడా అనుకోవచ్చు- ఈ యుద్ధములో గాజా లోని కొద్ది ప్రాంతము ఈజిప్టు చేతిలోకి పోగా, మిగిలిన గాజా ప్రాంతాన్ని గాజా స్ట్రిప్ అన్నారు .

**1967** లో ఇస్రాయిల్ దేశము - , గాజా లో వున్న ఈజిప్టు వారి మిలిటరీ బలగాలను, గాజా నుండి వెళ్లకొట్టి - అనగా ఈజిప్ట్ ను యుద్దములో ఓడించి మొత్తము గాజా ప్రాంతంను తన మిలటరీ ఏలుబడిలోకి తెచ్చుకుంది .

పాత పాలస్తీనాను మూడు ముక్కలుగా విడదీస్తూ జెరూసలేం అనే ప్రాంతాన్ని - యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజషన్ తన కింద వుంచుకున్నది కదా ? అందువల్ల - **UNO -- November 2012** న జెరూసెలెం ప్రాంతాన్ని తిరిగి పాలస్తీనా దేశంగా గుర్తించి - దానిని **UNO** లో **139** వ సభ్య దేశంగా ప్రకటించింది . ఆరకంగా చచ్చింది అనుకున్న పాలస్తీనా దేశము తిరిగి బ్రతికింది . ఈ నూతన పాలస్తీనా -- ఇజ్రాయిల్ అధీనము లో వున్న గాజాను కూడా తనకు ఇప్మ్మని కోరవచ్చు కదా ? అందువల్ల **UNO** ఇస్రాయిలును తమ - తన **165** వ సభ్య దేశంగా గుర్తించింది . రొండు దేశాలు కూడా **UNO** లో సభ్య దేశాలుగా ఉంటే అవి పరస్పరము యుద్వాలు

చేసుకోవు - చేసుకో రాదు అన్న ఉద్దేశ్యముతో **UNO** ఆ పని చేసింది .

కానీ కొత్తగా పుట్టిన పాలస్తీనాకు , ఇస్రాయిల్ దేశానికి మనసులు కలవలేదు . ఇస్రాయిలు దేశము తన పొరుగు దేశము ఐన పాలస్తీనాతో సత్సంభందాల ను ఆశించి - పాలస్తీనాతో ఒక శాంతి ఒప్పందం లాంటిది చేసుకునే ధోరణిలో **15 August 2005** నుండీ గాజాలోని తన సైనిక బలగాలను ఉపసంహరించుకుంటాను అని ప్రకటించింది . దీనికి అనుగుణంగా **2003** లో ఇస్రాయిలు పార్లమెంట్ లో ఒక చట్టము కూడా ఆమోదింపబడింది .

ఈ చట్టము కింద -- ఇస్రాయిల్ **2005** లో - గాజా నుండి తన ప్రభుత్వ / మిలట్రీ ఆఫీసులను పౌర కార్యాలయాలను / స్కూల్ / యూనివర్సిటీ వంటివాటిని వెనక్కి ఉపసంహరించు కొన్నది.


.

గాజా నుండి ఇస్రాయిల్ వెనక్కి వెళ్ళిపోవటం **2003** లోనే నిర్ణయం అయిపోవటం వల్ల- తనతో ఒక శాంతి ఒప్పందంలో భాగంగా ఇస్రాయిలు దేశము దానిని వదులుకుంటూ ఉన్నందున - పా

లస్తీనా దేశము - తమ దేశ అధ్యక్షుని ఎన్నిక కోసం జరిపే ఎన్నికలను - జనవరి **2005** లో ఇటు పాలస్తీనా తో పాటు అటు గాజా స్ట్రిప్ లో కూడా జరపాలని నిర్ణయించింది

. పాలస్తీనాలో గానీ / గాజాలో గాని ఇలాంటి ఎన్నికలు జరగటం **16** ఏళ్లలో అది మొదటి సారి . ఈ ఎన్నికలలో పాలస్తీనియన్ లిబేరైజేషన్ ఆర్గనైజేషన్ అనే సంస్థకు చెందిన వారు ప్రెసిడెంట్ గా ఎన్నిక అయ్యారు . పాలస్తీనియన్ లిబ్రె జేషన్ అంటే అర్ధము ఏమిటి **?** గతములో వున్నా పాత పాలస్తీనాను తిరిగి సాధిస్తాము అనేకదా **?** పూర్వపు పాత పాలస్తీనా కావలి అని కోరుకున్న పాలస్తీనీయులు ఈ గ్రూప్ని గెలిపించి వారికి అధ్యక్ష పదవి కట్టబెట్టారు .

**<>** ఈ పాలస్తీనియన్ లిబేరైజేషన్ ఆర్గనైజేషన్ అనే సంస్థ ఏమిటి **?<>** అంతకు మునుపు - **"**పాలస్తీనా అంతా తిరిగి ఏకము కావాలి **"** అంటూ ఇజ్రాయిల్ మీద అనేక మార్లు గొరిల్లా దాడులు చేసిన సమస్త ఏ ఈ పాలస్తీనియన్ లిబేరైజేషన్ ఆర్గనైజేషన్ అనే సంస్థ ఏమిటి . దీన్ని పట్టి చూస్తే ఇజ్రాయిలకు - పక్కలో బల్లెముల వంటి గాజా స్ట్రిప్ మరియూ పాలస్తీనా లభించాయి .

**<>** గాజా నుండి పె నక్కు మళ్ళుతూ వున్నా ఇస్రాయిల్- అక్కడి వున్నా ప్రజలు **{** ముఖ్యంగా ఇజ్రాయిల్ - యూదులు- తమ నివాస భవనాలను స్వచ్ఛందంగా ఖాళీ చేసి పోవాలని చెప్పి దానికి తగ్గ నష్ట పరిహారాలు ప్రకటించింది . ఈ నష్ట పరిహారాన్ని తీసుకొని - గాజా నుండి వెళ్లి పోవటానికి నిరాకరించి న కొందరు గాజా స్ట్రిప్ లోనే ఆగిపోయారు .ఇలా ఆగిపోయిన ఇస్రాయిలీయూదులలో ని

కొందరిని "హోమాస్ " వాబు బందీలుగా పట్టుకు పోయారు. వీరిని అడ్డుగా బెట్టుకొని ఇస్రాయిల్ ప్రభుత్వాన్ని అచేతనం చేయటం హమాస్ వారి వ్యూహము

**September 12, 2005** నాటికి తాను గాజానుండి పూర్తిగా వైతొలిగానని ఇస్రాయిల్ ప్రకటించుకుంది .తమ ప్రభుత్వానికి చెందిన కట్టడాలన్నింటినీ ఇజ్రాయిల్ స్వచ్ఛందంగా కూల్చి వేసుకుంది .అంటే ఇప్పుడు గాజా స్ట్రిప్ లో ఇస్రాయిల్ కట్టడాలు కానీ పౌరులు కానీ లేరు అధికారి క అర్ధము .

**2023** అక్టోబర్ నాటికి స్తే **-** కొత్తగా ఏర్పడిన పాలస్తీనా లో **-** ఇస్రాయిల్ అనేది వుండకూడదు అని భావించే **PLO** అనే సంస్థ కు చెందిన వారు దేశానికి అధ్యక్షుడిగా వున్నాడు . గాజాలో వారి కి ఎన్నికల ద్వారా వచ్చిన ప్రభుత్వమూ వున్నది అది కూడా **PLO** అనే సంస్థ కు చెందినది .

**<>** హమాస్ సంస్థ ఏమిటి **?** **<>** పూర్తిగా ఆయుధ పోరాటం ద్వారా ఇస్రాయి దేశము అన్నది లేకుండా చేయటము **-** గతములో మూడు ముక్కలుగా విడదీయబడిన పాత పాలస్తీనాను తిరిగి సాధించటం ఈ హమాస్ యొక్క లక్ష్యము .

గాజాలోని అరబ్ వారికి ఏ భయం లేకుండా చూచి **-** గాజాను ఒక ఇస్లానిక్ స్టేట్ గా మార్చటం **--**వీలైతే ఇస్రాయిల్ ని కూడా తిరిగి పాలస్తీనా భూభాగంగా చేసి **-** మొత్తము పాలస్తీనాను ఒక ఇస్లానిక్ స్టేట్ గా మార్చటం.వీరి లక్ష్యం. **2007** నుండీ ఈ హమాస్ సమస్థయే గాజాలో పాతుక పోయి అనధికారిక పాలన సాగిస్తూ గాజాపై పాలస్తీనాకు వున్నా అధికారం నామ మాత్రం చేసింది .

గాజా స్ట్రిప్ లో వున్నా అరబ్బీలనుఇబ్బందుల పాలు చేసినందుకు ప్రతీకారంగానూ - ఇస్లానిక్ భూ భాగాన్నిఇస్లానిక్ వారికి కాకుండా చేసి-యూదులు పొంది నందుకుప్రతీకారం గాను -మేముఇజ్రాయిల్ ను అంతము చేస్తాము " - అన్న పిలుపుతో హమాస్ ఇస్రాయిల్ మీద దాడికి దిగింది . మొత్తము పాలస్తీనాను తిరిగి సాధించటం కంటే ఇస్రాయిల్ అనే దేశమే లేకుండా చేయటమే హమాస్ లక్ష్యం .

అందువల్లనే నేడు హమాస్ మరియు ఇస్రాయిల్ మధ్య భీకర యుద్ధము నడుస్తున్నది . తమ తమ మనుగడ ఏ వీరికి ముందున్న పెద్ద సవాలు హమాస్ వారికి ఆయుధాలు ఎక్కడివి అంటే - అఫ్గనిస్తాన్ లోని తాలిబాన్లకు-- అమెరికా అందించిన ఆయుధాలే- అటుతిరిగి ఇటుతిరిగి వీరి చేతికొచ్చాయి .

రచన - సేకరణ వారణాసి శ్రీ రామ కృష్ణ